శ్రీ రామానుజ...





# వేదాంతరత్నాకరము

శ్రీహరిహరదాసుండును శ్రీమద్రామ భద్ర
పాదారవింద సేవా సక్తుండును, భాగవత
శిష్యుండును, కొత్త సుబ్బారాయుఁడుగారి
కుమారుండును నగు

## కొత్త వీరభద్రయ్యగారిచే

వ్రాయఁబడి

చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపించి
ప్రకటింపఁబడియె.

1919.

# విజ్ఞాపన.

“ఎవ్వరుమీరు కాళ్ళుముఖ మెఱ్ఱన? హంసలమెందు
కోదురీ ధవ్వున మానసంబునకు । దానివిశేషము
లేమిజెప్పుమా? మవ్వపుకాంచనాంబరము మౌక్తిక
ముల్ గలవన్న।నత్తలా? అవియెఱుంగమన్న నహాహా
యని నవ్వె। బకంబులన్నియుఁ”॥

భారతీయులారా! భక్తాగ్రేసరులారా! సర్వోత్తమమైన సత్యమతమును దెలియకుండ నూరు సంవత్సరములు జీవించుటకు మారు సర్వోత్తమమైన తత్వమును దెలసి ఒక దినము జీవించి ఆ మరునాఁడే జచ్చినను ఉత్తమము. మంచి యుపాయముతో గూడుకొనిన శ్రేష్టమైన వాక్యములు బాలునిచేత బలుకబడినను గ్రహింపఁదగినవే యగును. మంచి ఉపాయముతోఁ గూడికొనక శ్రేష్టములుగాని యితర వాక్యములు చతుర్ముఖబ్రహ్మచేఁ జెప్పబడినను విడిచి పెట్ట తగినవే యగును. వాసుదేవుఁడు పిన్నవాఁడని వసుదేవుని గొల్చువా రెవరుందురు. మన భారతమాత ఆదినుం

డియు భక్తిజ్ఞాన వైరాగ్యములచే దులదూగుచుండి మధ్య శుష్కించియు మరల మొలక లెత్తుచున్నందుకు ధన్యులము. నేను విశేషముగా చదువరిని గాకున్నను విషయములలో నెల్ల ముఖ్యమై గొప్పదైన వేదాంత మును వ్రాయుటకు గొన్ని కారణము లున్నవనియే నానమ్మకము. అందు ఒకటి రెండు జెప్పెదను. అమా యకులగు వారికి వేదాంతము ఉపన్యసించెద మని మోసము జేసి వారివలన డబ్బుదిని వారికి ఏదో ఒకటి చెప్పి వారి మనస్సుల చెడగొట్టువారును, మంత్రోప దేశ మొనర్చెద మని ఏదో ఒక మంత్రమును జెవిలో గొణిగి మోసము జేయువారును వున్నందున ఇవి యన్ని యును నిరర్థకములని కొందరికైనను దెలియుట కొరకు నై వున్నది.

నేను ఇదివరకు ఒకటి రెండు చిన్నపొత్తములను వ్రాసి యుంటిని. అందు మొదటిది శ్రీ కూడలి సంగ మేశ్వర మహాత్మ్యం" రెండవది "సీతావిజయము". దీనిని వ్రాసి అచ్చున కిచ్చు సందర్భములో దీనివలన నేమి లాభ మని సంశయించి అర్జునునకు శ్రీకృష్ణునివలె

నాకును చెలికాడగు శ్రీ జంపాల వెంకటేశం బి. ఏ., గారితో యీవిషయమై ప్రస్తాపించగా వారును కథా రూపములకన్న నీకు దెలిసినంతవరకు వేదాంతమును దేటతెల్లముగాను స్పష్టముగాను చదివినంతనే మనస్సున కెక్కునట్లుగాను నొక చిన్ని పొత్తము వ్రాయు మన శ్రీ కృష్ణార్జున సంవాద రూపమున నాకు దెలిసినంత వరకు "వేదాంతరత్నాకర" మను నీచిన్ని గ్రంథమును వ్రాసి అచల బ్రహ్మమైన శ్రీరామభద్రునకు సమర్పించితి. ఈగ్రంథమునగల వానియందుగాని వేరేగా గాని విశేషముగా దెలియ గోరువారు సంగం జాగర్లమూడి గ్రామమునకు విచ్చేసిన నాకు దెలసిన విషయములను మనవి జేయుటకు వేచియున్నాడ.

ఇట్లు భక్తజనవిధేయుఁడు,

కొత్త వీరభద్రయ్య.





శ్రీ రామాయనమః.

# వేదాంత రత్నాకరము.

శ్రీమదనంత కల్యాణగుణగణ విశిష్టుండును స్మరణ మాత్రసంతుష్టుండును సచ్చిదానంద స్వరూపకుండును నాదిమధ్యాంతరహితుండును నంతర్బహిర్వ్యాపకుండును యోగిజన హృజ్జేగీయమానుండును నశరీరుండును నైన భగవంతుండు మనుజరూపంబున నవతరించి ద్వారకాపురియందు సర్వజనులయుల్లంబుల గరగించుచు సర్వజనులను భ్రమింపజేయుచు నిత్యానంద సుఖమునందోలలాడుచున్న బుత్రుని వినోదమందిరమునకరిగి కౌమరునిచేతను గోడండ్రచేతను బూజింపబడి వారికిదీవనలిచ్చి వసుదేవుండిట్లనియె. పుత్రరత్నమా! నీచెల్లెలు సుభద్రను నర్జునుండొంటిగా రథమువిూదం బెట్టుకొని పోయెను. ఆ యిందుముఖి యెటులనున్నదో

తెలియదు. నీవు చతురంగబలములతో వివిధవస్తువులం గొని నీబావమఱదులకును మేనత్తయైన కుంతీదేవికిని మర్యాదలు జరిపించి సుభద్రకు బుద్ధిమతులు జెప్పి వివిధ వస్తువాహనముల నిచ్చి రమ్మనిన నావాసుదేవుండును మందస్మిత ముఖుండై జననీ జనకుల యిష్టమును రుక్మిణీ సత్యభామలకుం దెల్పి వివిధవస్తువాహనములతో రథారూఢుండై ద్వారకాపురి రాజమార్గంబున బోవుచుండిన యాసుందర పురుషునింజూచి పౌరులాశ్చర్యపడి ఱెప్పలార్పక చూచువారును మావంటి కామినులను విరహాగ్నిం ద్రోచి పోదగునా యనువారును మరల త్వరలో వచ్చువను వారును యీసౌందర్యమును మనంబున గీలుకొల్పి మూర్ఛాపరవశులగువారును మిగుల వైరాగ్యముతో బ్రాణాయామముచేత దృక్కులనిల్పి నిశ్చేష్టితులగువారును నగుచుండగా దానువింద్రప్రస్థంబునకుంబోవుచు దనరాక ధర్మసూనున కెరిగించిన నాపాండవాగ్రజుండు ఎదురేగి దోడ్కొనివచ్చి యుచితాసనమునం గూర్చుండ బెట్టి క్షేమముల విచారించి పురుషోత్తమా! మాభాగ్యవశమున నీదర్శనమయ్యె.

మేము ధన్యులమైతిమి మీరు ససైన్యముతో విచ్చేసిన గారణమేమన తావచ్చిన సమాచారముం జెప్పి తా దెచ్చిన వస్తువులనిచ్చి యంతఃపురములోనికిం బోయి తనమేనత్త యైన కుంతీదేవికి నమస్కరించి దీవనలుగైకొని ద్రౌపదీ సుభద్రలకు తా దెచ్చిన వస్త్రాభరణములనిచ్చి సుభద్రకు నీతివచనముల బోధించి చతురంగబలములను ధర్మరాజునకు కానుకగానిచ్చిన నంతధర్మరాజుండు మహాత్మా! దేవరవారి కటాక్షముండువరకు చతురంగబలము లేలయని గీర్తించి యతనితో బ్రియములాడుచు ధర్మాధర్మముల నెరుంగుచు గొన్ని దినములు గడపె నంత నర్జునుండు నొకనాడా గోవిందుని జూచి మనమిరువురము వసంతకాలములో సౌఖ్యార్థముగ యమునానదీ ప్రాంతములందు విహరించి వత్తమురమ్మనిన నా వాసుదేవుండును సమ్మతించి యిరువురకు భోజన వస్తువులను బరిచారకులను జాగ్రతపరచుకొని వడిగల తురగముల నెక్కిపోవుచు వన్యమృగముల గూల్చుచు గొలకులలో దిగి కలవపూలగోయుచు బంతములాడినీదుచు పున్నాగ వృక్షములక్రింద గూర్చుండుచు ఫలకు

సుమభరితంబులై మెరసిని చిగురుటాకులు గల వృక్ష లతలను జూచుచు మాధుర్యఫలముల భక్షించుచు దేట చల్లని నీరు త్రావుచు సుగంధపూల గోసి యాఘ్రాణించుచు పోయి పోయి యమునానది ప్రదేశమును జేరి పగలెల్ల బూపొదరిండ్లయందును బొరిద్దుకుంకిన పిదప భోజనానంతరమున యానదీసమీప సైకతభూమి మీద గూర్చుండి తాంబూలముజేయుచు నదీ తరంగముల మీద వ్రాలి చల్లగా వీచెడు మలయా మారుతమునకు నానందించుచు సరస సల్లాపము లాడుచు తనదొడలపై శిరంబుంచి పవ్వళించిన వాసుదేవునిం జూచి అర్జునుండిట్లనియె. సఖా! దేవకీనందనా! తారాపతి నిష్కళంకముగా బ్రకాశించుచున్నాడు. నామనంబిపుడు నిర్మలముగానున్నది. ఏమార్గముచేత జన్మశూన్యమై మోక్షము సంభవించునో యామార్గం బెరింగించుమని ప్రార్థించెను. ఆభగవంతుండు వికసిత ముఖుండై కుంతీనందనునిం జూచి నేడు నీపలుకులు వినోదముగానున్నవి .భగవదంశసంభూతులకుం దప్ప నితరులకు స్ఫురణకురాని దడిగితివి. నీకు తొలిజన్మమున నారాయణఋషి

సంసర్గముగలుగుటచే నీకది సన్నిహితమయ్యె. నీభాగ్యమేభాగ్యము. మోక్షమనగా విదేహకైవల్యము. అది తత్వయోగజ్ఞానులకేగాని యితరులకు సాధ్యముగాదు. మంత్రి యంత్రి తంత్రిములును మతములును సాకారధ్యానంబును దారులోహాదిశిలలకు నామరూపంబులుగల్పించి పూజించుటయు తీర్థయాత్రలు సేవించుటయు గుళ్లుగోపురములు గట్టించుటయు వేషధారులైన బ్రాహ్మణులను పూజించుటయు మోక్షమార్గములుగావు. అర్చనవందనాది పూజలు సద్గురు బ్రహ్మమునకును ధ్యానము నిరాకారమైన యాత్మునకును గావించుటే మోక్షము. ఇది సులభముగా దెలుసుకొను మార్గముపదేశించెదను సావధానుండవై వినుమని ఇట్లుజెప్పదొడంగెను. పార్థా! విధికృతము దప్పించుకొనుట బ్రహ్మకును దరముగాదందురు. విధికృతమన వేదము. వేదములను నంతమొందించినదే వేదాంతము. అదియే ఉపనిషత్తు. వేదములు కర్మను మాత్రము దెలుపును.

వేదాంతము మోక్షమును దెలుపును. వేదాంతమునందు సాంఖ్యతారక అమనస్కములని మూడు పద్ధ

తులు. ఇందు అమనస్కమునందు మనస్సునిలుపుటకు తక్కినవి రెండును మార్గములు. అమనస్కమునందు నిల్చిన పిమ్మట నేవియును అవుసరముండదు. గాన మొదట సాంఖ్యతారకముల వాసనజూపి అమనస్కమును జెప్పెదను. సాంఖ్య మనశరీరమును గూర్చి చెప్పునది. శరీరమునకు తొమ్మిది కంతలు యేడుకమలములు నుండును. గుదస్థానమునందుగల కమలమునకు మూలాధారమని లింగస్థానమందుండు దానికి స్వాధిష్ఠానమని నాభిస్థానమందున్న దానికి మణిపూరక మని హృదయస్థానమందున్న దానికి అనాహత మని కంఠస్థానమందున్న దానికి విశుద్ధమని భ్రూమధ్యస్థానము నందున్న దానికి ఆగ్నేయమని బ్రహ్మరంధ్రమునకు సహస్రారమని చక్రముల పేర్లు. ఈచక్రములే భూలోక భువర్లోకాదిలోకములని బ్రహ్మవిష్ణుశివాది దేవతలని యందురు. వీటి నన్నిటిని సానుకూలముగా నెరిగినను నెరుగకున్నను జీవుడు తాను జేయు పని ఒకే విధముగా జేయును. అనగా వైద్యశాస్త్రమును సానుకూలముగా నెరింగిన పండితుడు ఆహారమును దిని యేవిధముగా జీర్ణింప

జేయునో యేమియు దెలియని శిశువు సహితము తాను దిన్న ఆహారమును అదే విధముగా జీర్ణింపజేయును. గాన విశేషముగా శారీరమునందలి భ్రిమను వదలి శరీరమే దేవాలయ మని అందుండు జీవుడే దేవుడని దెలసి భ్రమను గల్గించెడి సర్వమును వదలవలయును. నేను, నీవు బ్రహ్మావిష్ణుశివాదులు మాత్రమే గాక మనకు దోచెడు సర్వమును భ్రిమేయని సాంఖ్యమును దాటి తారకమును దెలియవలెననిన అర్జునుండు ఓ కృష్ణా, పర మాత్ముండవైన నీకంటె తారకమును బోధించు వారె వరు దానిని సెలవివ్వ మని వేడ కృష్ణుండు చెలికాడా, తారక మనగా సూక్ష్మవిచారణ. దానిని అపోద్యోతు లచేత చూడవలెను. శరీరములో నుండి శరీరముచేత పనులు చేయించువాఁడు తారకబ్రిహ్మము. శరీరములో నున్నపుడు తారకమును తారకములో నున్నపుడు శరీర మును భ్రిమగల్గకుండుటకు తారకమును దాటి సుల భోపాయముగ దెలుసుకొనుటకు దగ్గర త్రోవయైన అమనస్కమును సులభోపాయముగ దెలుసుకొను

మార్గము జెప్పెదను గాన అచంచలుడవై వినుమ జెప్పఁదొడంగెను.

అమనస్కమన కళలోని నిష్కళపరిపూర్ణస్వరూపమైన భగవంతునిలో తానున్న అణుమాత్రమైన భాగమని తెలుసుకొని తాను పరిపూర్ణమందు గలియుట. తాను గలియకున్న పరిపూర్ణవస్తువు పూర్తిగాక కొరత కలిగి యుండును. అట్లు తాను గలసిన పిమ్మట పరిపూర్ణుఁడైన వానికి మనస్సు వేరే లేనందున అమనస్కము.

దీనిని దెలిసికొనిన నీవున్ను, నేనున్ను ఒకటే గనుక నీవు అడుగుట నేను జెప్పుట లేదు. అయినప్పుడు నిత్యమైన ఈశ్వరస్వరూపము అనఁగా నాస్వరూపమును జీవుఁడవనుకొను నీవు దెలియవలెను. నేను అంతట నిండియున్న వాఁడను. నేను అన్నిటిని నాయందు నిండించుకొని వున్న వాఁడను. అనగా ఒక పూర్ణకుంభమునకు లోపలను వెలుపలను మధ్యను పూర్ణముగా నిండి యుండువాఁడను. లోపల వెలుపల మధ్యను యేమియు లేని వాఁడను. నిర్గుణుఁడను. [illegible]

నిరాధారుఁడను నిర్మలుఁడను అచలుఁడను అణువుల లోను మహత్తులలోను నిండియున్నవాఁడను. అయిన యిట్టి నాయందు నీమనస్సును నిల్పి నీవు మనస్సు లేనివాఁడవై అమనస్కమనే వేదాంతమును దెలిసి నీవే కృష్ణుండవు గమ్మనిన చలించుచున్న మనస్సును నిగ్రహించి కృష్ణునియం దైక్యపరచి తానున్ను కృష్ణుడై నిర్గుణుడై నిర్వికారుడై మారాడక అచలస్వరూపమైన అర్జునునిజూచి కృష్ణుండిట్లనియె. అర్జునా ! కదలమెదలక దారుస్వరూపమును బొందితివేల యని సరససల్లాపములాడ దొడంగినను మారాడక పరిపూర్ణ స్వరూపము నొందియుండెను. అపుడు కృష్ణుండదిజూచి పరిపూర్ణానుభవము లేని కారణంబున గదాయని తానుమెల్లగా అర్జునునితొడలనుండిలేచి కరంబుకరంబునంబట్టి పార్థా! నీకింకను పూర్ణానుభవంబు గల్గు లేదనిన విని నమస్కరించి పూర్ణానుభవంబు గలవా రెట్లుందురనిన జెప్పదొడంగె. ఎవరికి దృఢమైనజ్ఞానము కలదో వారెన్నటికి మృతినొందరు. ఎవరికట్టి జ్ఞానము లేదో వారుజీవించియు మృతులైనవారు. నాశహేతువగు

ప్రిపంచభోగము సత్యమనియు శాశ్వతమైన సత్యస్వరూపమైన చైతన్యమునందు నమ్మకముంచక అస్మృతమనియు దలచి ప్రిపంచసుఖము లనుభవించువారికేగాని నీవంటిజ్ఞానసిద్ధివడసిన భక్తులకు శరీరముచేత ప్రిపంచసుఖము లనుభవింపజేసినను దారువలెకదలకున్నను నొకటియే యగును. సత్యమైనజ్ఞానమునుదెలసి అసత్యమైన కర్మల నేలజేయవలెననిన యథార్థమును దెలసినవారు యెట్లుజేసినను భాధకరము లేదుగాన సర్వజనహితమునకు అనగా కేవలము అసత్యములైన వేదములే సత్యమనియు వేదకర్మమే పుణ్యమనియు నూహించక సత్యమైన వేదకర్మల నాచరించుచు ఫలితమునుకోరక ఈశ్వరార్పణగా శరీరమును ధరించినందుకుగాను కర్మలజేయుదురు. జేసియువారు కర్మలనంటక అమనస్క ధ్యానపరులగుటచే ముక్తినేజెందెద రనిన అర్జునుండిట్లనియె. బావా భగవంతుడవైన నీవు అసత్యమైన ప్రపంచమేలగల్గించితివనెను. పార్థా, అసత్యముండినగేగదా సత్యమిదియని దెలుసుకొనుట. అంతయు నిత్యమైన సత్యమేమైన యెడల సత్యాసత్యముల దెలియు

యెట్లు దెలుసుకొనువారెవరు. కృష్ణా నీవింతటి మాయ లవాడవని నీవేజెప్పకుండిన నేనెట్లుయెఱుంగగలను. ఎరిగియు మరలమరల నీమాయలలో మునుగుచునే యుంటిని. పూర్వమొకప్పుడు బ్రాహ్మణసేవ కర్తవ్య మనిజెప్పితివే. అపుడేల యట్లు అసత్యమును జెప్పితివి. పార్థా నేనెప్పుడును, అసత్యమును జెప్పువాడనుకాను. అప్పటికి నీకు పరిపూర్ణానుభవము లేని కారణమున బ్రహ్మజ్ఞానము కలిగి తామే బ్రహ్మమైనగాని బ్రాహ్మ ణులు కాజాలరని నీవు దెలుసుకొనలేకపోతివి. అట్టి బ్రాహ్మణులను సేవించక ఇపుడుమాత్ర మెట్లు ముక్తి గల్గును. నీవేల బ్రహ్మఋషియైన వశిష్టుడే వకసమ యమందు భ్రమజెంది తనశిష్యుడైన త్రిశంఖ మహారాజు శరీరముతో ముక్తి జెందు నుపాయము జెప్పుమని వేడిన, రాజామావంటి తపస్సంపన్నులయిన బ్రాహ్మణ ఋషులకే గాక బ్రాహ్మణేతరుడవై రాజ్య మేలు మీవంటి రాజు లకు ముక్తిగల్గునా యని పరిహాసించిన, రాజుమనంబున దిగులుజెంది మనధనంబెంత దినినను బ్రాహ్మణులు తిర్గి సహాయము జేయనొల్లరని యెంచి బ్రాహ్మణేతరుడై

క్షాత్రవంశమున బుట్టి ఋషులలో నెల్ల మేటియనిపించు కొని బ్రహ్మఋషియై యున్న విశ్వామిత్రమహర్షి యొద్ద కుంజని జర్గిన వృత్తాంతంబంతయు నెరింగించిన ఈస్వల్ప కార్యమునకే యింతవగపేల నేనెరింగించెదనని బ్రహ్మ జ్ఞానోపదేశ మొనర్చి జీవన్ముక్తినొందించెను. బ్రహ్మ జ్ఞానమును బొందుటకు కులగోత్రములనవసరముగాని మనస్సంకల్పమవసరము. మనోనిశ్చయముచే నేకార్యము జేసినను నీడేరును. గనుక నీవేమియొనర్చినను అచంచల మనస్కుడవై కార్యమూనుము నేను సమస్తవస్తువులకును ఆదికారణాంబైయుండువాడను నేనులేనిస్థావరముగానిజంగ మముగాని లేనేలేదు. అప్రాకృతంబులైన నామహిమలు అపరిమితములు. సత్యము అసత్యముగాను అసత్యము సత్యముగాను సర్వజనులకు దోచును. అందు శాశ్వత మైన సత్యమును గ్రహించుట దుర్లభమును అగును.

ఈ ప్రపంచనాటకమునకు నేనే సూత్రధారుం డను. నేను వినాప్రపంచ మేమియు లేనే లేదు. నేనూ రకుండిన ప్రపంచ మూరకుండును. గాన నీవీ సత్య మును దెలసి నీవున్ను ప్రపంచమున్ను లేనిదిగా భావించి

నన్ను బొందుము. అందుకుగాను దేహవాసన, జగ ద్వాసన, శాస్త్రవాసన, విడువుము. దేహవాసన యనగా శరీరమునందు గలుగు వికారములు తనవని తోచుచుండునట్టి వాసన. అనగా తాను దేహముకంటె విల క్షణుడయ్యును నేను గంగాస్నానమువలన పరిశుద్ధుండ నైతినని శరీరగత ధర్మములను తనయం దారోపించు కొనుట. జగద్వాసన యనగా జగత్తుసత్యమనియు దాని యందుత్తమ ప్రవర్తకుల నడవడికతోపాటు తాను ప్రవర్తింపవలయు నను వాసన. శాస్త్రవాసన యనగా యదార్థమగు బ్రహ్మజ్ఞానమును దెలుపక అజ్ఞానవిష యక మగు కర్మము లందలి ధర్మములను తెలుపునట్టి వాసన. వీటివదలి నిత్యమైన నన్నుమాత్రము వదలకు మనిన అర్జును డిట్లనియె.

"హే కృష్ణా! అయదార్థము లగు ఈప్రపంచము. పంచభూతములు యదార్థమైన నీవలననే బుట్టెనుగా" యనిన కృష్ణుం డిట్లనియె. నావలన ఆకసము, ఆకాశము వలన వాయువు వాయువువలన అగ్ని అగ్నివలన జలము జలము వలన పృథివి పృథివి వలన ఓషధి

ఓషధి వలన అన్నం అన్నం వలన పురుషుడు గల్గినను స్వర్ణమువలన జేయుబడిన భూషణములయందు స్వర్ణబుద్ధిగల్గినపుడు కల్పితములైన నామరూపాత్మక వస్తువుంఖ నశించి స్వర్ణమేనిలచినట్లు, పరమాత్మనైన నాయందుబుద్ధిని నిల్పినపుడు నాచే కల్పింపబడిన నామ రూపాత్మక ప్రపంచము నశించుచున్నది. అనంతరము నిల్చునది పరమాత్మనైన నేనొక్కడనే. దృశ్యమైన ప్రపంచమంతయు మిథ్యగానెరింగి యదృశ్యమైన నన్ను మాత్రం నిత్యముగా నెరుంగుము. అటుపిమ్మట సర్వ వ్యాపకమైన పరబ్రహ్మవస్తువు నీవే యగుదువు గనుక నిన్ను నీవే తెలిసికొనదగుననిన అర్జునుడు కృష్ణా! నీయం దైక్యమగుటకిట్టి సులభోపాయముండ కొందరు స్నాన జపతపములను ఉపవాసములను గోముఖాది పద్మాసన ములను అపానవ్యాపారమందు ప్రాణవ్యాపారమును ప్రాణవ్యాపారమందు అపానవ్యాపారమును ప్రాణాపాన మార్గములను బంధించి ప్రాణాయామమునందు ప్రాణ వాయువులను లయింపించి యనేకసంవత్సరముల కొలది కష్టపడుదురుగదా వారిగతి యేమనిన కృష్ణుడు

పార్థా! వారలు నే జెప్పిన పరబ్రహ్మస్వరూపమైన నన్ను దెలుసుకొనువరకు యెన్ని వేలసంవత్సరములు తపించినను నన్ను బొందజాలరు. అవియన్నియు శరీర సాధకములగు నేగాని జీవన్ముక్తి మార్గములు కాజాలవనిన అర్జునుండు పులకాంకిత శరీరుండై నమస్కరించి నేనీవనంబున నేనుండి నీస్వరూపమును ధ్యానించుచు జీవన్ముక్తి వడసెద. నీవు ఇంద్రప్రస్థంబున కరిగి ధర్మరాజాదుల సంతసింపజేసి ద్వారకకుం జనుమనిన, భగవంతుండు, సఖా నీవు లేక నేనొక్కనిమేషంబైననుండగలనా భగవత్స్వరూపులమైన మనము మెక్కడ నుండిననేమి, పరిపూర్ణస్వరూపమైన నాస్వరూపము యీయడవియందుండి ఇంద్రప్రస్థంబున లేకుండునా, మనకు కర్మతోనున్ను రాజ్యముతోనున్ను అవసరములేకున్నను, లోకానుగ్రహమందు ఆసక్తిచేత కర్మకాండమునందు కోరికతో నొప్పునట్టి మనుష్యస మూహమునకు సంతోషము కల్గించుటకున్ను లోకులు దుర్మార్గప్రవర్తకులుగాకుండుటకున్ను ఫలమునుగోరక సర్వకర్మలను మనమున్ను జేయవలెను జ్ఞానసిద్ధి వడసి జేసిన కర్మలు తామరాకు నీళ్లనంటని విధమున జ్ఞానుల

వంటజాలవు. కర్మఫలాసక్తుడు కాక నిర్వికారమైన బుద్ధి వృత్తిచేత కర్మలను ఆచరించినను ఆ కర్మ ఫలముల చేతపూయబడడు. నేనున్ను ఈభరతఖండమందు యుండవలయునని వున్నాను అట్లుండుట బుద్ధిని నిగ్రహించియేకాని ప్రేమపూర్వకముగా యుండుటకాదు ఇక్కడనాచేజేయవలసినవేవియు లేవు. బాహ్యవస్తువుయొక్క కూడిక లేని బుద్ధి వృత్తియందు బుద్ధి నిద్రజెందినవాని యొక్కస్థితిని పొందియుండును. అటువంటి వికార శూన్యమైన బుద్ధివృత్తిచేత పనులు జేయుచున్నాను. గనుక కర్మలవల్ల నేను పూయబడిన వాడనుకాను. ఓయర్జునా! ఇంద్రియములవల్లనుండి ఇంద్రియజన్యమైన కర్మలవల్లనుండి ఆత్మయొక్క విభాగములందుతత్వమును తెలసినవాడు ఇంద్రియములు శబ్దాదివిషయములందు ప్రివర్తించుచున్నవేగాని తానుప్రివర్తించుటలేదని తలంచి ఆకర్మఫలములందు తానుచేరడు. ఇట్లు వికారశూన్యమైన బుద్ధిచేత కర్మలను జేయువాడు ఆకర్మఫలములతోచేరడు. మరిన్ని కొంచెము తెలిసీనటువంటి బుద్ధిగలవారలను విచారింపగా ఈవేదాంతశాస్త్రము మూర్ఖత్వమును పొం

దించును. గాన నీబ్రహ్మవిద్యను పరిపూర్ణముగా దెలిసి
కొనినను నెక్కడనుండినను ఏమిపని జేసినను పరబ్రహ్మ
స్వరూపమునే పొందుదుము. అన్యవిద్య లనేకములు
దెలసికొని అడవియందు ముక్కుమూసుకొనినను ఇంటి
యందు రాజ్యమేలినను అవి నశించునవే యగుననిన
అర్జునుండు స్వామీ! వేషధారులగు మహాఋషుల
వేషముల వలనను గాయత్రాదిమంత్ర జపముల వల్లను
నేమి ప్రయోజన మని యడుగ అర్జునా! అనుభవము
లేని అన్యఋషివలె యడిగెద వేల బూటకఋషి వేషము
ధరించి మాపంచను బడి యుండి గాయత్రాది జపముల
జేయుచు మా సుభద్రచే నర్చనలనంది నీవు ఫలితమును
పొందలేదా? ఫలితమును పొందియు పరబ్రహ్మస్వరూ
పమును దెలియగల్గితివా? యటువంటి వేషధారులగు
మహర్షులెల్ల బొందు ఫలిత మట్లే యుండును. అనిన
అర్జునుడు స్వామీ! నావలెనే జ్ఞానోపదేశమును
బొందియు వైరాగ్యముచే కర్మలను జేయనని తిరిగి
మీవంటి పెద్దలచే దెలియబడి కర్మల నాచరించిన
వారెవరయినను గలరా యనిన, అర్జునా ఇట్లే పూర్వ

మనేకమంది వైరాగ్యము నొందియు తామరాకు నీళ్ళనంటని విధమున సంసారసుఖము లనుభవించిరి. వారల చారిత్రంబు జెప్పుదవనిన అర్జునుండు బావా! అట్టి చారిత్రంబు గలిగియు ఇపుడు జీవించి యున్న వారుండిన వారి చారిత్రంబు జెప్పుమనిన శుకమహర్షి యొక్క చరిత్రము నీచరిత్రమునకు సమానమై ఇకమీాద నున్న జన్మముల నాశనమునకు కారణమై ప్రకాశించుచున్నదిగాన దాని వినుము. ఆశుకమహర్షి లోకసంచారముచేత స్వచ్ఛమైన అజ్ఞానరహితమైన ఆత్మస్వరూపమును ధరించి వేరొక సహాయమును లేక తానే మాటిమాటికి విచారించుకొని తానుగానే బుద్ధియందు బ్రహ్మవిచారణనొనర్చి తనమనస్సునందు కోరిక లేకపోవుటను పొంది ఆప్రకారము ఆత్మస్వరూపమును తెలిసికొనియు గురువులేని కారణమున పూజ్యమగు పరబ్రహ్మ వస్తువు సందు నెమ్మదిపొందక తాను తనంతటతానే తెలుసుకొనిన సద్వస్తువుకన్న వేరేదియు లేదని మనస్సునందు నమ్మకమునొందక మేరు పర్వతమున రహస్య ప్రదేశమందు గూర్చుండియుండిన తండ్రియగు వ్యాసునకు నమస్కరించి

ఓ వ్యాసమహాముని! ఎన్ని జన్మములకైనను వదలిపోక చుట్టుకొని వచ్చుచుండెడి సంసారము ఎందుకు గల్గినది అదియెట్లు నాశనము నొందు దీనిస్వరూపము జెప్పవా? యన ఆవ్యాసులుజెప్పిన పరబ్రహ్మ స్వరూపమును విని ఇదితాను తెలిసికొని యున్నదేకాని వేరుగానుండునది గాదని తలచి మనస్సునందు లక్ష్యపెట్టక నిలచియుండగా వ్యాసులు శుకాభిప్రాయమెరిగి ఓపుత్రా నీప్రశ్న కుత్తరవుజెప్పుటకు నేనంతగా నెరిగినవాడనుకాను జనక మహారాజు యథార్థముగా జెప్పగలుగునుగాన వానిని పొంది నీసందేహమును నివర్తించుకొమ్మనెను. అంత శుకుండు యాపర్వతము దిగి విదేహపురమున కరిగి తావచ్చిన కారణము జనకమహారాజునకు దెల్పుమని ద్వారపాలకులతో మనవిజేసెను. ఆసేవకులద్వారా జనకమహర్షి శుకుని సంగతి దెలిసికొని ఏడు దినములు ఏసంగతియుజెప్పక నూరకుండగా ఆశుకుడును భయము లేక అమనస్కభావము నొందియుండెను. అనంతరము ఆశుకునిరప్పించి అంతఃపురములోనుంచి యవ్వనస్త్రీల చేతను పదార్థములచేతను ఆశుకాచార్యులబుద్ధిని బరీ

ఉంచి ఆవల ఏడుదినములకు శుకమహర్షిని పిలిపించి సాష్టాంగ నమస్కారములొనర్చి సమస్తమైన జగత్కార్యములను నిశ్శంకముగా బోగొట్టుకొనియు సమస్తమయిన కోరికలను పొందియు నిను కోరదగిన దేమి యున్నదో చెప్పుమా యని తన తండ్రినడిగిన విధముననె నడుగ యారాజు ఒ శుక మహాముని నీతండ్రియైన నటువంటి వ్యాసునిచే బలుకబడిన దేదో అదియే తప్ప భూమియందు వేరొకటి లేదు. గనుక నీవు గృహమున కరిగి గృహస్థుడవు కమ్మా యన ఓ జనక మహారాజా నాజ్ఞానబలముచే దెలిసికొని నదియు నాతండ్రి వలన తెలిసికొని నదియు జ్ఞానులలో శ్రేష్ఠుడవగు నీవలన దెలిసికొని నదియు శాస్త్రములయందు చూడబడినదియు నొకటియే యయ్యెను. గాన నిక సందియము లేదన, ఓ శుకాచార్యా! మన కన్నులకు కనబడెడి ఆకాశము మొదలుగాగల పంచభూతములే స్వరూపము గాగల ప్రపంచము లేనే లేదు. ఈ హేతువు వలన ఆత్మకంటె అన్యమగు దేహేంద్రియాది సంసారమునకు మృషాత్వమును ఆత్మ యొక్క సంశయముచేత కల్పింప

బడుటయును ఆత్మకు సంకల్పముచేత బంధమును సం
కల్పము లేకపోవుటచేత మోక్షమును గలుగును. గనుక
నీకు విషయ సుఖమే స్వరూపముగాఁగల దృశ్యవస్తువుల
యందు ఆశ లేక యున్నది. ఇప్పుడు పరిపూర్ణ చిత్తముగల
వాఁడవై పొందదగిన బ్రహ్మవస్తువును పొందితివి. ఇక మీఁద
ఈదృశ్య ప్రపంచములో దేనియందును చిక్కుపడవు. ఇక
సంశయింపక చనుమా యనిన సమస్త సంశయములను
వదలి జనకరాజు నాజ్ఞవడసి మేరు పర్వతము జేరి వివా
హమాఁడి సుఖంబున నిజపత్నీయుతుండై నలుగురు కొమ
రులను నొక పుత్రీరత్నమును గాంచి జీవన్ముక్తినొంది
ఇప్పటికిని నున్నవాఁడనిన అర్జునుండు సంతసించి కృష్ణా
మట్టితో జేయబడిన కుండ కడవలను తెలసినవాడు మట్టి
యేయనుకొనినట్లు నీచే చేయబడిన ప్రపంచము నీవేయని
దెలియజెప్పితివి. నీవేయైన యీసర్వప్రపంచము తిరిగి
తిరిగి నీయందే లయము జెందుచుండగా యీ జ్ఞానవిద్య
నేల యభ్యసింపవలెనో దెల్పుమన ఈశ్వరుండు అర్జునా
ఈజ్ఞాన విద్య పూర్తిగా నెరిగిన పిమ్మటగదా సర్వము
నేనని దెలియునది. శరీరముండగనే యుక్తాయుక్తముల

దెలసి జీవన్ముక్తులగుటకు ఈవిద్యవినా వేరేదియు కాదని
దెలియుమనిన అర్జుననందు మందస్మితముఖారవిందుండై
భగవంతుండనైన నీవేజ్ఞానోపదేశము సర్వ నాసంశయము
లుదీరకుండునా ఇక నామనస్సునకేవిధమగున భయమును
అనుమానమును లేదనిన కృష్ణుండు పార్థా మనమీయర
ణ్యంబున ప్రవేశించినదాదిగా రెండవపక్షంబును సఖం
బరిగె, ధర్మరాజాదులు మనలగూర్చి యేమనుకొనుచుం
డిరో నీదినంబున నిక శయనించి ప్రుదయంబున ఇంద్రప్ర
స్థంబున కరుగుదమనిన వల్లెయని యారాత్రి గడపి
ప్రుదయంబున నిత్యకృత్యంబులం దీర్చి తురగారూఢులై
వనవినోదంబులం జూచుచు శుకపికశారికాది పుంగుల
గీతంబుల కానందించుచు క్రమంబుగా ఇంద్రప్రస్థంబు
నకుం జని ధర్మరాజాదులకు నమస్కరించివారికి సంతో
షము గలుగునట్లుగా ధర్మాధర్మములం దెలుపుచు నొక
మండలంబుండి వారలచే సెలవునొంది అర్జున సహిత
ముగా రథారూఢుండై ద్వారావతీ పురంబునకు విచ్చేసి
దేవకీవసుదేవులను ఆనందింపజేయుచు రుక్మిణీ సత్య
భామాప్రియుండై సర్వగోపగోపీజనంబులకును బ్రహ్మా

గాది సర్వజనంబులకును సకలభూతములకును మనోభీష్టం బుగా కాలంబు గడపుచు పాండవకౌరవుల యుద్ధంబున తిరిగి అర్జునునకును గలిగిన సందియంబులం బాపితాను సారథియై దుష్టశిక్షణంబొనర్చి ధర్మజు నభిషిక్తుంగావించి సుఖంబున నిత్యానంద సుఖంబు లనుభవించుచుండెను.

గాన నోచదువరులారా! మతములు వ్యర్థములు ఏమతమందును దేవుని దర్శనము గలుగనేరదు. దేవునకు నామరూపములు లేవు దారు పాషాణలోహాదిబొమ్మలను దేవులని భావింపకుడు. అనేకమంది వేదాంతమున బూటకమని భ్రమజెందుచున్నారు. కాని వేదాంత మార్గము సుఖకరముగాని కష్టమార్గముగాదు. సన్యాసి రూపములను పొందియుండిన దేహసన్యాసులనుజూచి భ్రాంతిపడకుడు. వారిమార్గము లభ్యాసమార్గము లే కాని వారు వేదాంతులుగారు. వేదాంతులే యారూ ఢులు వారికి నియమములు లేవు. నియమములమాత్ర మిడువరు. వారికి భేదము లేదు. వారుగృహములనైనను అడవులనైనను నుందురు. సూక్ష్మములో మోక్షమని బరమరహాస్యమే బట్టబయలనిదెలసి, కనిగ్రుడ్డియు,

విని చెప్పుదును, నొందక నీగ్రంథమును సానుకూలముగా జదువువారు జీవన్ముక్తి నొందుటకేమియు సంశయముం డదు. వేదాంతము నాకనవసరమనివదలక నీగ్రంథ మును చదువువారెవరైనను జీవన్ముక్తి నొందుదురు. ఈమార్గమును దెలిసియే ఋషులెల్ల జీవన్ముక్తినొంది ఇప్పటికిని జీవించియున్నవారు. ఈమార్గమెల్లరు దొరకు టకు దేవుడనుగ్రహించుగాకయని విరమించుచున్నాడను.





*For Copies of:—*

# ఉత్తరరాఘవము.

*Write to,*

**Chandrika Press,**

**GUNTUR.**

